## दासोऽहं

९७. दासोऽहं वणिजांश्चापि व्यापारेऽभिनिवेशिनाम्
यौरेवसर्व वस्तूनि लभ्यन्ते सर्वतो भुवि ॥

मैं उन व्यापारियों को दास हूँ जिनके द्वारा सभी तरह की चीजें सारे भूमण्डल को मिलता है ।

(97) I surrender myself in service to the Business Magnates, who with their tact and craft,provide all varieties of goods necessary for the mundane world.

९८. दासोऽहमेव सर्वेषां धर्ममार्गानुगामिनाम्
येषामात्मबलेनैव धरित्री धार्यते सदा ॥

जिनके आत्मबल से हमेशा भूमि को चेतनता मिलती है ऐसे धर्म-मार्ग के संचारियों को मैं दासहूँ ।

(98) I surrender myself in service to the disciplined and lawful Personalities, whose mental and spiritual strengths maintain the Earth ever steady in peaceful equilibrium.

९९. दासोऽहं शान्तचित्तस्य शान्तिरेव विभूषणम्
यां विना धनवान्विद्वान्नकोऽपि सुखमेधते ॥

जो प्रशांति से रहता है उसके मैं दास हूँ क्योंकि शांति के बिना धनवान या ज्ञानी को भी सुख नहीं मिलता । शांति ही मानव जीवन में सच्चा अलंकार है ।

(99) I surrender myself in service to the Tranquil. No one can ever be happy without peace of mind,how great he may be in wealth or in education.

# दासोऽहं

१००. दासोऽहं निर्विवादस्य विवादरहितो जनः
सख्यं कुटुम्बसौख्यञ्च कीर्तिं प्राप्नोत्यनुत्तमाम् ॥

विवाद रहित व्यक्ति को मैं दास हूँ। क्योंकि विवादों से दूर रहनेवाला व्यक्ति सभी से स्नेह चाहता है अपने परिवार में भी सुख संतोष पाता है और सुकीर्ति भी पाता है।

(100) I surrender myself in service to the Non-controversial People as they alone can achieve great heights of glory,priceless friendship,domestic pleasure and spiritual status.

१०१. दासोऽहं राममातुश्च कौसल्यायाः पुनःपुनः
याह्येव मानिनी लोके केवला हरिमध्यमा ॥

जो मानिनी हरिमध्या के नाम से विख्यत है और साक्षात श्रीराम की माता कोसल्या को मैं दास हूँ।

(101) I surrender myself in service to Kausalya,the lady with leonine waist,and the great mother of Sri Rama,who is Dharma personified. (The compound word— 'Hari Madhya'—is generally used by poets to denote the slim waist of a lady. Here the poet intentionally used this not only to denote the beauty of the mother Kausalya,but also to establish the fact that Sri Hari the Protector, dwelled in her womb.)

१०२. दासोऽहं भाग्यवत्याश्च यशोदाया निरन्तरम्
शिशुवक्त्रसरोजाते यापश्यदखिलं जगत् ॥

मैं बहुत बडी भाग्यशालिनी यशोदा माता को दास हूँ। क्यों कियशोदा माता छोटा शिशु श्रीकृष्ण के कमल जैसे मुखमें सारे जगत का दर्शन करके धन्य होगयी।

(102) I surrender myself in service to the fortunate Yasoda Devi, who witnessed the Entire Cosmos in the small cute face of Lord Sri Krishna.

१०३. दासोऽहं वसुदेवस्य जगद्भारवहं हरिम्
शिशुरूपं महात्मा यो बभार शिरसा पुरा ॥

सारे जगत का भार सहन करने वाला हरि बचपन में जब शिशुरूप( श्रीकृष्ण का रूप) में था तब महात्मा वसुदेव उसको अपनेशिर पर रखा था उसको मैं दास हूँ।

(103) I surrender myself in service to Vasudeva,the father of Sri Krishna,because he carried on his head the Divine Child,who bore this entire universe in His little belly.

१०४. दासोऽहमन्वहं तेषां येषां चेतस्सरोवरे
कृतज्ञतासरोजानि विकसन्ति पुनःपुनः ॥

जिनके मन रूपी सरोवर में कई बार कृतज्ञता के कमल विकसित होते है उनको मैं सदा दास हूँ।

(104) I surrender myself in service to those Pious People, whose minds(('Manasa Sarovars') incessantly bloom the flowers of gratitude to God.

१०५. दासोऽहं सत्यशीलानां धर्ममार्गानुगामिनाम्
दैवार्पितचित्तानां सारासारविवेकिनाम् ॥

जो लोग विवेकी होते हैं उनके मैं दास हूँ। क्योंकि वह सच्चाई को अपना शील मानता है धर्म-मार्ग पर चलता है, भगवान को ही अपना मन समर्पण करता है और इस दुनिया में क्या सच्च है और क्या झूठा है जानता है।

(105) I surrender myself in service to the Intellects of the Great,whose character is befitted with truth,and who can discriminate between good and evil, and who always travel in the path of Dharma,and who have dedicated their heart and soul to the pursuit of God,the Almighty.

# दासोऽहं

१०६. दासोऽहं तत्ववेतॄणां नित्यानन्दप्रदायिनाम्
सर्वधा शान्तचित्तानामन्वहं स्मितभाषिणाम् ।।

हमेशा हँसते रहनेवाला और बोलनेवाला, सभी समयों में शांतचित्त से रहनेवाला, सदा दूसरों (जगत)को शाश्वत आनंद देनेवाला दार्शनिक को मैं दास हूँ ।

(106) I surrender myself in service to the Philosophers,who converse with their ever cheerful faces,and contemplate with peaceful minds fill this world with delight unparalleled.

१०७. दासोऽहं भारतीदेव्या वेंकटरामशास्त्रिणः
यावुभौ जन्मदातारौ पूज्यपादौ निरन्तरम् ।।

मैं भारती और वेंकटरामय्य शास्त्री दंपतियों को दास हूँ । क्यों कि वे हमेशा मेरेलिए पूज्यवान हैं और मुझे जन्म दिये हैं ।

(107) I surrender myself in service to my revered and venerable Parents-Smt.Bharati and Sri Venkata Ramaiah Sastry, for giving me this meaningful life with their grace and benevolence.

१०८. दासोऽहं सर्वदेवानां लोककल्याणदायिनाम्
यत्कृपा सर्वकालेषु ददाति जयमङ्गळम् ।।

मैं लोक कल्याणकारी सभी देवताओं को दास हूँ । इनकी कृपा से सदा सबका जीवन मंगलमय होता है ।

(108) I surrender myself in service to the Divine Gods, who bless me kindly and keep this world with all prosperity and well being of one and all.

इति कौण्डिन्य सगोत्रेण कडिमिळ्ळ वंशसजाजातेन बुच्चमांबा शेषय दंपत्योः पौत्रेण, भारती वेङ्कटरामय शाश्त्रि दंपत्योः पुत्रेण रमेश श्रीविरिञ्चि नामक कव्योर्जनकेन गुरुसहस्त्रावधानिना वरप्रसादेन प्रणीता दासो ऽहम् नाम्नी कृतिस्समाप्ता ।।

***********************************

# దాసోఽహం గురుదేవానామ్

1. శ్రీపాదాన్వయ సమ్భూతం లక్ష్మీనారాయణం గురుమ్
నౌమి శిష్యచకోరాణాం కౌముదీదాయినం విధుమ్!!

తా. శిష్యచకోరములకు కౌముదిని ( వెన్నెలను, సంస్కృత వ్యాకరణ శాస్త్రమును) ప్రసాదించిన శ్రీపాదవంశ సంజాతుడైన లక్ష్మీనారాయణ గురుచంద్రుని నమస్కరించుచున్నాను.

2. గోపాలకృష్ణమేధావీ శాస్త్రార్థచతురాననః
విజ్ఞానవిశ్వనాథోఽయం విభాతి హృదయే మమ!!

తా. మేధావి, శాస్త్రార్థములో నాలుగు ముఖములు గల బ్రహ్మవంటివాడు (తర్క, వ్యాకరణ, మీమాంసా, వేదాంతములనే నాలుగు శాస్త్రములు నోటియందు గలవాడు.), విజ్ఞాన విశ్వమునకు ప్రభువు(ఇంటిపేరు విశ్వనాథ) అయిన గోపాలకృష్ణ గురుదేవులు నా హృదయములో ప్రకాశించుచుండును.

3. సర్వశిష్య హృదారామాం సూర్యనారాయణాభిధామ్
శుక్లాం నమామి పుంరూపాం సాలఙ్కారాం సరస్వతీమ్!!

తా. శిష్యులందరి హృదయములే నివాసముగా గలది, సూర్యనారాయణ అనుపేరు గలది, తెల్లని రంగు కలిగినది, అలంకారములతో కూడినది, పురుషరూపములో ఉన్నది అయిన సరస్వతిని నమస్కరించుచున్నాను. ( అలంకార శాస్త్రములో ప్రామాణిక పండితులు, తిరుపతి రాష్ట్రియ సంస్కృతవిద్యాపీఠం డీన్ మా గురుదేవులు ఆచార్య కొంపెల్ల రామసూర్యనారాయణ)

4. కొమ్పెల్లాన్వయ జాతస్య సత్యనారాయణస్య వై
దర్శనం శాబ్దికజ్ఞానమ్ భాషణం వాగ్విభూషణమ్!!

తా. కొంపెల్లవంశములో జన్మించిన సత్యనారాయణ మహోదయుని దర్శనమే వ్యాకరణజ్ఞానము. ఇక మాట్లాడితే అది వాగ్విభూషణమే!!

5. హృదయం సర్వదేహేఽపి వర్తతే యన్మహాత్మనః
కోటారాయ గురుం వన్దే తమహం మార్గదర్శినమ్!!

తా. ఏ మహాత్ముని శరీరమంతటా హృదయము నిండియున్నదో మార్గదర్శియైన ఆ గురుదేవులు కోటారావుగారిని నమస్కరించుచున్నాను.

6. నిమ్మగడ్డాన్వయోద్భూతః సుబ్రహ్మణ్యో గురూత్తమః
భారతీ తస్య జిహ్వాగ్రే నిత్యం నృత్యతి నృత్యతి!!

తా. నిమ్మగడ్డ వంశోద్భవుడైన సుబ్రహ్మణ్యుడు గురూత్తముడు. వారి నాలుక కొనపై భారతి నిత్యం నృత్యం చేయుచునే ఉండును.

7. శ్రీపాదాన్వయసంభూతౌ పితాపుత్రౌ గురూ మమ
లక్ష్మీనారాయణం మూలం రామకృష్ణం ఫలం భజే!!

తా. శ్రీపాద వంశంలో జన్మించిన తండ్రీ కొడుకులు ఇద్దరూ నాకు గురువులే. మూలమైన శ్రీలక్ష్మీనారాయణుని, ఫలరూపమైన రామకృష్ణుని సేవించెదను.

8. సంస్కృతాన్ధ్రాంగ్లభాషాణాం పఠనే పాఠనేఽపిచ
నిస్తులా ప్రతిభా యస్య సోమయాజీ స మే గురుః!!

తా. సంస్కృత ఆంధ్ర ఆంగ్లభాషల పఠన పాఠనములలో ఎవరి ప్రతిభ సాటిలేనిదో అట్టి సోమయాజులు గారు నా గురుదేవులు.

9. మిత్రమ్ గురురభూత్ చిత్రమ్ సౌజన్యాది గుణాచ్యుతః
రామరాజస్సమే మిత్రః చిత్తాబ్జానన్దకారకః!!

తా. నా మిత్రుడే నాకు గురువగుట చిత్రము. సౌజాన్యాది గుణములలో అచ్యుతుడైన రామరాజు నా మానస పద్మానికి ఆనందం కలిగించే మిత్రుడు( సూర్యుడు)

10. సంస్కృతే శాస్త్రసాహిత్యే యయా దత్తే ముదా మమ
తామన్నపూర్ణాం వన్దేఽహం వాత్సల్యసుగుణాత్మికామ్!!

తా. సంస్కృతశాస్త్రసాహిత్యాలు రెండూ ఎవరు నాకు ఆనందముగా అందించారో, వాత్సల్యమనే సుగుణముతో కూడిన ఆ అన్నపూర్ణమ్మను నమస్కరించుచున్నాను.

11. సర్వజ్ఞో దేవభాషాయాం కూర్మనాథో గురూత్తమః
వన్దేఽహం కౌముదీ యేన దర్శితాద్యా సమఞ్చితా!!

తా. మొట్టమొదటగా గొప్పదైన కౌముది(వెన్నెల, సంస్కృతవ్యాకరణము)ఎవరిచేత నాకు చూపించబడినదో అట్టి గురూత్తముడు, దేవభాషయందు సర్వజ్ఞుడునైన కూర్మనాథశాస్త్రిగారిని నమస్కరించుచున్నాను.

12. బహుభాషాసు శాస్త్రేషు ప్రజ్ఞావాన్ శిష్యవత్సలః
గోపాలకృష్ణమాచార్యో నిస్తులం మమ దైవతమ్!!

తా. బహుభాషలయందును, అనేక శాస్త్రములయందును ప్రజ్ఞావంతుడు, శిష్యవత్సలుడు అయిన శ్రీమాన్ అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు నాకు సాటిలేని దైవము.

13. రావూర్యన్వయ వేఙ్కటేశ కవితా మన్దాకినీవాహినీ
పుణ్యస్నానఫలేన శిష్యనిచయే నైకే మహాపణ్డితాః
సఞ్జాతాః కవయో వధానధనినో వైమర్శకాగ్రేసరాః
తం ప్రాతస్స్మరణీయమేవ హృదయే ధ్యాత్వా జయామ్యన్వహమ్!

తా. రావూరి వేంకటేశ్వరుని కవితామందాకినీప్రవాహములో పుణ్యస్నానము చేసిన శిష్యబృందములో ఎందరో మహాపండితులయ్యారు. మఱెందరో కవులయ్యారు. ఇంకెందరో అవధానధనులయ్యారు. మఱియు చాలమంది విమర్శనాగ్రేసరులయ్యారు. అటువంటి ప్రాతస్స్మరణీయుని నిత్యము హృదయమున ధ్యానించి, జయించుచున్నాను.

## ఆశీస్సుమస్తబకము

**ఆచార్య కొంపెల్ల రామసూర్యనారాయణ**

రాష్ట్రీయ సంస్కృతవిద్యాపీఠం

తిరుపతి.

---

చి.కడిమిళ్ళ వరప్రసాద్ ముప్ఫై యేండ్ల పైబడి అష్టావధానిగా, శతావధానిగా, సహస్రావధానిగా, గురుసహస్రావధానిగా లోకంలో కీర్తిప్రతిష్ఠలను ఆర్జించిన కవి. అవధాని కాకముందునుంచి నాకు శిష్యుడు. ఈ వజ్రకిరీటాలు అతనిని ఇంకా అలంకరించని సమయంలో అతడు వినయవంతుడు. ఈ అలంకారాలన్నీ అతనిని గర్విష్ఠిని చెయ్యాలి. కాని ఒక్కొక్క అలంకారమూ అతనిని పూర్వంకంటె వినయవంతుడిని, సంస్కారవంతుడినీ చేసాయి. ఇది కేవలం నా మాటలలోనే కాదు, అతని మాటల్లోనూ, చేతల్లోనూ, అతని మనస్సులోను కొలువు తీరిన విషయమే. ఆ వినయసంస్కారానికి అక్షరరూపమే ఈ కృతి.

జగత్తులో ఎందరిదగ్గర ఎందరు ఉపకారాలు పొందలేదు కనక. అందరూ అందరినీ గుర్తుంచుకోవడం, అందుకని కృతజ్ఞతను ప్రకటించడం ఎక్కడ జరుగుతోంది గనుక. మరీ గొప్పవాడైన వ్యక్తి కృతజ్ఞతా ప్రకటనాన్ని తనస్థాయికి తగనిదానిని గాను, లేదా తనకు తక్కువతనాన్ని కలిగించే విషయంగాను భావించడం లోకంలో లేని విషయమేమీ కాదు. కృతజ్ఞత చూపించకపోతే పోయె. కృతఘ్నత చూపించకుండా ఉంటే అదే పదివేలు. ఇవాళ అటువంటి కృతఘ్నులకుకూడ లోటు లేదు ఈ లోకంలో. ఇప్పుడతడు తాను పుట్టిన ఊరికి, ఆ ఊరిపెద్దలకీ, తాను చదువుకున్న ఊరికీ, తాను చదువుకున్న గురువులకీ, తన స్నేహితులకీ, జన్మవంశానికీ, విద్యావంశానికీ, పంచిపెట్టగలిగినంత ప్రతిష్ఠని కైవసం చేసుకున్నాడు. ఆ ప్రతిష్ఠనూ, ప్రతిష్ఠవల్ల కలిగే ఆనందాన్నీ వాళ్ళందరికీ పంచిపెట్టాలనే తపన ఈ పుస్తకంగా అక్షరాకృతి దాల్చిందని నాకనిపిస్తుంది.

సంస్కృతభావాలను సంస్కృతంలోనే అందించే ఈ ప్రయత్నం ముమ్మాటికీ శ్లాఘాస్పదమైనది. ఇతని గ్రంథరచనకు ఇదే గణపతిపూజ కాదు. ఇంతకుముందు కూడ సంస్కృతంలో ఒకటి రెండు పుస్తకాలను ఆవిష్కరించిన,

అవధానాలలోకూడా సంస్కృత సమస్యలనూ దత్తపదులనూ పూరించి ధారణ చేసిన క్షుణ్ణాధ్వనీనులు.

ఎంతటిభావమైనా ప్రసన్నంగాను, చమత్కారంగాను అందించగలగడం ఇతనికి పాలబుగ్గలనుండి అగ్గవైన విద్య. ఈ కృతిలోని శ్లోకాలన్నీ కృతజ్ఞతాకృతులు. మనసారా ప్రేమగా అర్పించిన సుగంధభరిత పూజాసుమాలు. చమత్కారమరందతుందిలాలు. దాసోஉహం ఈ పేరే చాలు కవిలో గూడు కట్టుకున్న కృతజ్ఞతాభావానికి నిలువెత్తు అద్దం. నాకు మరింత ఆనందమేమంటే కృతికర్త కడిమిళ్ళ వరప్రసాద్, అలాగే కృతిభర్త చట్లపల్లి జగన్మోహన్ ఇద్దరూ నాకు శిష్యులే. మామా అల్లుళ్ళిరువురూ నాకు శిష్యులు కావడం లోకంలో ఎవరికో కాని దక్కని అదృష్టం.

కృతేచ ప్రతికర్తవ్యం ఏష ధర్మస్సనాతనః అని, కృతజ్ఞత అనేది ఒక సనాతన ధర్మంగా సకల ప్రపంచంలోనూ ఆదరింపబడేది. ఆదరింపవలసినది. పద్మాలు తమను వికసింపజేసిన సూర్యుడు అస్తమించే వేళ దుఃఖాక్రాంతమై చిన్నబుచ్చుకోవడం, చంద్రుడు అస్తమిస్తే కలువలు ఖేదపడడం చూస్తే సనాతనధర్మం స్థావరజంగమాత్మక సకల ప్రపంచంలోను అనుష్ఠింపబడుతున్నట్లు గోచరిస్తుంది. అందువల్ల మానవజాతిలో ఇది ఉంటే సద్గుణం కాదేమో కాని, లేకుంటే మాత్రం దుర్గుణమే. కృతజ్ఞత ఉన్నవారికెల్లా కవి దాసోஉ హం అంటూ రచించిన ఈ పుస్తకం అందరిలోనూ కృతజ్ఞతాభావాన్ని పాదుకొల్పాలని ఆశిస్తూ, ఈ కవి వ్రాసిన

దాసోஉహమన్వహం తేషాం యేషాం చేతస్సరోవరే
కృతజ్ఞతాసరోజాని వికసన్తి పునఃపునః!!

అనే శ్లోకాన్ని ఉదహరిస్తూ కవినాశీర్వదిస్తూ ముగిస్తున్నాను.

ఇట్లు

**రామసూర్యనారాయణ**

తిరుపతి

11.1.11

# దాసో-హమను బుద్ధి అహంకారమును తొలగించును

దోర్బల ప్రభాకరశర్మ
కొవ్వూరు.

## ప్రస్తావపఞ్చకము

1. భారతికి(తల్లికి)వాహనమైన రాజహంసమా! హంసస్వరూపమైన కడిమిళ్ళ వంశమునకు చిత్తశాంతిని ప్రసాదించువాడా! వరప్రసాదా! కడిమిళ్ళా! కవులలో హంసమా! సర్వోత్తమముగా ప్రకాశించుము.

2. తాము పంపిన శతశ్లోకవిభూషిత దాసోఽహమను కావ్యము చేరినది. చూచి, సమగ్రముగా దాసోఽ హమైతినని భావించితిని.

3. ఈ కావ్యము హృదయమున భక్తిని పెంచినది. బుద్ధిలో శక్తిని కలిగించినది. చేతికి ముక్తినందించినది. మంచివానియందాసక్తిని ప్రసరింపజేసినది.

4. దాసోఽహమను క్రమవ్యవస్థ లేని వానిని క్రమవంతుని జేసి, క్రమశిక్షణ గలవానిని జేసితివి. నిరతము శోకసంతతి గల మనిషిని శ్లోక(పుణ్యకీర్తి)సంతతి గల మనీషిగా సజ్జనునిగా నొనర్చితివి.

5. మీనుండి ఆవిర్భవించిన దాసోఽ హమను కలభాషిణి యగు కృతికన్య జగన్మోహనుని సాంగత్యముచే జగత్తును తప్పక మోహింపజేయును.

# అనుకృతి నవకము

1. దాసోఽహమను బుద్ధి అహంకారమును తొలగించును. అసూయ అను రాత్రిని హరించు ఆ బుద్ధికిదే వందనము.

2. దాసోఽ హమను చక్కని విశ్వాసపూర్ణభావముతో నిండిన మనస్సు గలవారలకు, వినయవంతులకు, నీతిసంపన్నులకు, నిర్దోషులకు, నిష్పాపులకు మనము(మేము) ఎల్లప్పుడు కృతజ్ఞులము.

3. కావ్యమున దాసోఽ హమను శబ్దముచే సమాజమందు గురులయందు, హితులపట్ల, అంతటా కృతజ్ఞతాభావమే సారింపబడినది.

4. దాసోఽ హమనుచు వంచనావ్యాపారమొనర్చువారికిని, చిత్తమున చాంచల్యదోషమున్నవారికిని ఈ శతకము ఔషధము.

5. దాసోఽహమనునది ద్వైతము కాదు, అద్వైతమును కాదు, రెండునూ కాదు, రెండునూ కావనియు కాదు . ఆలోచించువారికి, తెలిసినవారికి దాసోఽహమనునది సర్వదా సోఽహమైన సచ్చిదానందమే.

6. దాసోఽహమనునది గొప్ప ఔన్నత్యము కాదు. చిన్న న్యూనత్వమును కాదు. రెండును కాదు. సమత్వము కాదు. అసమత్వమును కాదు. అది సర్వకామప్రదమైన కదమ్బము. విశిష్టమైన కడిమిచెట్టు.

7. దాసోఽహమను శబ్దము ఒక అనుగ్రహము. ఒక వరము. ఒక సర్వేశ్వరము. అది కదంబమును (కడిమిని) ఆశ్రయించిన ఆ వంశీయులందరకును ఉపాసించువారందరికిని పరమాశ్రయము. శ్రీలలితను హరిగా, అఖిలముగా, కల్పవృక్షముగా ఉపాసించువారి కులమున ఆ దాసోఽహమను శబ్దము వరప్రసాదము.

8. సర్వాత్మకుడైన పరమాత్మకు దాసుడనని మీరు సంతోషించితిరి. ఏమియు ఆవశ్యకము కాదని, లేదని నేనును దాసో౽హమని సంతసించితిని.

9. దాసో౽హమని పూర్ణమైనారు మీరు. నింపబడినారు. (నేనును) దాసో హమని పూర్ణులమై పారమును చేరినాము (ను).

## ఆశంసా చతుష్టయము

1. ఓ సుకవీ! సంస్కృతాంధ్రములందు, వచనమునందును, కవితావిషయమున మీ ప్రయత్నము సఫలమైనది. ఆ కావ్యభారతి మిమ్ము కాపాడుగాక!

2. మీ కావ్యముచే దేశమున ధర్మమున, ప్రాణిసమూహమున, కవిఋషిమౌనిబృందమున, భారతీయవాఙ్మయమునను సర్వాత్మనా ప్రీతి కలిగింపబడినది.

3. తమ సరళమైన ఈ కృతిచే సంస్కృతమున ప్రీతి పెరుగును. చదువువాడు సహృదయుడు సంస్కృతమున తప్పక మాట్లాడగలడు. అట్టి సామర్థ్యమునొందును.

4. తల్లిదండ్రులు, పిల్లలు, శిష్యులు మీ కుటుంబమంతయు కవి (కవిమయము). సహృదయము. సారస్వతమయము. కావున ఇది ఇట్లే పారంపర్యముగా ఎదుగుగాక!

భవదీయ

**ప్రభాకరశర్మ**

# కృతిపతిః

## శ్రీ చెట్లపల్లి జగన్మోహనః

విశ్రాంతసంస్కృతభాషోపాధ్యాయః

ఆంధ్రప్రదేశే పశ్చిమగోదావరీమండలే భీమవర పురవాసీ

---

1. చెట్లపల్ల్యన్వయే జాతో జగన్మోహన నామకః

పండితోఽపి చ నిర్గర్వీ సౌహార్దం తస్య భూషణమ్!!

తా. చట్లపల్లి వంశమునందు జన్మించిన జగన్మోహన నామధేయుడు పండితుడయ్యును గర్వము లేనివాడు. స్నేహగుణమే వానికి అలంకారము.

2. మిత్రహృత్పద్మమిత్రత్వం యస్య వాచి ప్రవర్తతే

చైతన్యదాయీ సర్వేషాం స జగన్మోహనో బుధః!!

తా. మిత్రుల హృదయములనే పద్మములను వికసింపజేయగల మిత్రలక్షణము(సూర్యలక్షణము) ఎవని వాక్కునందు ప్రవర్తిల్లునో అతడే జగన్మోహన పండితుడు. అందరికిని చైతన్యమును అందించువాడు.

3. దివారాత్రం యస్య హాసే కౌముదీ పరివర్తతే

ప్రేమపీయూషసందాయీ స జగన్మోహనో విధుః!!

తా. ఎవని నవ్వులో పగలు రాత్రి అనే భేదం లేకుండగా వెన్నెల కురియునో ( కౌముది యనగా సంస్కృతవ్యాకరణశాస్త్రము.), ప్రేమ అనే అమృతాన్ని అందించు ఆ చంద్రుడు జగన్మోహనుడు.

4. దాసోఽహం కృతికన్యేయం సఙ్కల్పతనయా మమ
శ్రీజగన్మోహనార్ధాఙ్గీ భూత్వా సమ్మాన్యతాం గతా!!

తా. దాసోఽహమ్- అను పేరుగల ఈ కృతికన్య నా సంకల్పతనయ. ఇది శ్రీజగన్మోహనునకు అర్ధాంగియై సమ్మాన్యతను పొందినది.

5. తారాస్సన్తు సహస్రశోఽమ్బరతలే రాకాశశీ కాన్తిమాన్
భాషాస్సన్తు ముఖే ముఖే బహువిధా గీర్వాణవాణ్యుత్తమా
తద్భాషాంబుజజాతదివ్యమకరన్దాస్వాదనానన్దినమ్
సారఙ్గం పరమేశ్వరశ్శుభదృశా పశ్యేజ్జగన్మోహనమ్!!

తా. ఆకాశంలో ఎన్ని తారకలు ఉన్నా పూర్ణిమా చంద్రుడే ప్రకాశవంతుడు. అందరి నోళ్ళల్లో ఎన్ని రకాల భాషలు ఉన్నా సంస్కృతభాష మాత్రమే ఉత్తమమైనది. అటువంటి ఉత్తమమైన సంస్కృతభాష అనే పద్మమునుండి ఉద్భవించే దివ్యమైన మకరందమును ఆస్వాదించి ఆనందించే తుమ్మెదవంటి జగన్మోహనుని పరమేశ్వరుడు శుభదృష్టితో చూచుగాక.

కృతికర్తా
గురుసహస్రావధానీ
**డా.కడిమిళ్ళ వరప్రసాదః**
దూరవాణీ. **9247879606.**

నరసాపురమ్,
2010.

# అనుష్ఠానమ్

1. వేద సువర్ణ విభూషిత భూమిః
దేవనదీరస రఞ్జితభూమిః
శీతనగేశ్వర రక్షితభూమిః
భాగ్యవతీ ఖలు భారతభూమిః!!

2. వాల్మీకిరేవ జగతః కవితావిధాతా
యేనాక్షరా మధురరామకథా ప్రవృత్తా
తల్లేఖనీసురతరుప్రసవాభిజాతామ్
దివ్యాం సుధాం పిబతి భారతభూమిరేషా!!

3. శ్రీరామో మమ దేవతా రఘువర స్సత్యవ్రతో ధార్మికః
వైదేహీ హృదయారవిన్ద మధుపో వన్దారుకల్పద్రుమః
నిత్యం సత్కవి చిత్తకేకిమధురో వర్షాఘనశ్యామలః
శిష్టానామభయఙ్కరః కుజనహా కోదణ్డధారీ హరిః!!

4. యన్నామస్మరణేన సర్వజనతా పాపాటవీ దహ్యతే
యన్నామస్మరణేన సంసృతి మహావారాశిరుత్తార్యతే
యన్నామస్మరణేన ముక్తివనితా గాఢం సమాలిఙ్గతే
తద్రామస్య పదామ్బుజాత రజసా లోకస్సదా జీయతే!!

5. యేనైవ శ్రుతిమాన్ బభూవ హనుమాన్ శ్రీయాజ్ఞవల్క్యో మునిః
శ్రీరామో జితరావణో రణతలే కున్తీసుతశ్చాన్నదః
సత్రాజిన్నరపాలకశ్చ మణిమాన్ కృష్ణాచ సంరక్షితా
తం సూర్యం ప్రణమామ్యహం త్రిజగతీ గాఢాన్ధకారాపహమ్!!

# దాసో-హమ్

1. దాసోఽహం గురుదేవానాముత్తమజ్ఞానదాయినామ్
వాత్సల్యపరిపూర్ణానామన్వహం హితభాషిణామ్!!

తా. ఉత్తమమైన జ్ఞానాన్ని ఇచ్చేవారు, వాత్సల్యంతో నిండినవారు, ఎల్లప్పుడూ హితమునే పలికేవారూ అయిన గురుదేవులకు నేను దాసుడను.

2. దాసోఽహం జ్ఞానపూర్ణానాం గురూణాం కలభాషిణామ్
యేషాం వాత్సల్యపీయూషం లోకవర్ధనకారణమ్!!

తా. ఎవరి వాత్సల్యమనే అమృతము లోకము వృద్ధి పొందుటకు కారణమగుచున్నదో, అటువంటి అవ్యక్తమధురముగా మాట్లాడు జ్ఞానపూర్ణులైన గురువలకు నేను దాసుడను.

3. దాసోఽహం దేవమౌనేశ్చ నారదస్య మహాత్మనః
రామాయణకథాగానే వాల్మీకిర్యేన చోదితః!!

తా. రామాయణమును పలికేందుకు వాల్మీకి ఎవనిచే ప్రేరేపింపబడెనో అట్టి మహాత్ముడు, దేవమౌని అయిన నారదునకు నేను దాసుడను.

4. దాసోఽహమేవ దేవర్షేః యస్య ప్రేరణయా ముదా
వ్యాసో భాగవతం సృష్ట్వా శాన్తిం చేతసి లబ్ధవాన్!!

తా. ఎవరి ప్రేరణచే సంతోషముతో వ్యాసుడు భాగవతాన్ని సృజించి, మనశ్శాంతిని పొందాడో అటువంటి దేవర్షియైన నారదునకు నేను దాసుడను.

5. దాసోఽహం గురురాజస్య సాందీపనిమహాఋషేః
యస్యైవ శిక్షణే కృష్ణో జగద్గురురభూత్ పురా!!

తా. పూర్వం ఎవరి శిక్షణలో కృష్ణుడు జగద్గురువు అయ్యాడో అటువంటి గురురాజైన సాందీపని మహర్షికి నేను దాసుడను

6. దాసోఽహం సురభారత్యాస్త్రయీ యత్ర ప్రవర్తతే
వర్తన్తే యత్ర శాస్త్రాణి జ్ఞానం యత్ర ప్రదీప్యతే!!

తా. ఎక్కడైతే వేదములు ప్రవర్తించుచున్నవో, శాస్త్రములన్నీ ఎక్కడ ఉన్నాయో, ఎందు జ్ఞానం ప్రకాశమానమవుతోందో అటువంటి దేవభాషయైన సంస్కృతమునకు నేను దాసుడను.

7. దాసోఽ హం కవిపూజ్యానామక్షరాద్భుతశిల్పినామ్
రసరాజ్యప్రణేతౄణాం జగదానన్దదాయినామ్

తా. అక్షరాలతో శిల్పాలను నిర్మించే అద్భుత శిల్పులు, రసరాజ్యాన్ని శాసించువారు, ప్రపంచానికి ఆనందాన్ని ఇచ్చేవారు అయిన పూజ్యులైన కవులకు నేను దాసుడను.

8. దాసోఽ హం ఖలు మత్స్యానాం యేషాం వంశే జగత్పతిః
ఆవిర్భూయ హి వేదానాం రక్షణం కృతవాన్ పురా!!

తా. జగత్పతియైన భగవానుడు పూర్వకాలంలో ఏజాతియందు ఆవిర్భవించి, వేదాలను రక్షించాడో అటువంటి మత్స్యములకు నేను దాసుడను.

9. దాసోఽ హం కూర్మజాతేశ్చ యద్రూపేణ మహాహరిః
మన్థరాద్రిభరం భృత్వా దేవతానాం సుధాం దదౌ!!

తా. ఏ జాతియందు మహావిష్ణువు ఉద్భవించి, మంథరపర్వత భారాన్ని భరించి, దేవతలకు అమృతాన్ని ఇచ్చాడో అటువంటి కూర్మజాతికి నేను దాసుడను.

10. దాసోఽహం చ వరాహస్య యస్యరూపేణ మాధవః
రక్షణం కృతవాన్ భూమేః రాక్షసాద్ ఘోరకర్మణః!!

తా. ఘోరకర్ముడైన రాక్షసుడు హిరణ్యాక్షుని బారినుండి భూమిని రక్షించేందుకు మాధవుడు ఏరూపాన్ని ధరించాడో అటువంటు మహావరాహానికి నేను దాసుడను.

11. దాసోఽహం మృగరాజస్య హరిర్దేవో యదాననః
హిరణ్యకశిపుం ఘోరం జఘాన సురవైరిణమ్!!

తా. ఏ శిరస్సును ధరించి శ్రీహరి ఘోరరాక్షసుడైన హిరణ్యకశిపును సంహరించెనో అటువంటి మృగరాజునకు నేను దాసుడను.

12. దాసో౽హం వామనస్యాపి దివ్యసన్దేశదాయినః
కాలాగమనపర్యన్తం యస్యౌన్నత్యం నదర్శితమ్!!

తా. అనుకూలమైన సమయం వచ్చేవరకు తన ఔన్నత్యాన్ని ప్రదర్శించరాదనే దివ్యసందేశాన్ని లోకానికి అందించిన వామనమూర్తికి నేను దాసుడను.

13. దాసో౽హం జామదగ్న్యస్య హరేః పరశుధారిణః
సహస్రబాహవో యేన ఖండితాస్సమరాఙ్గణే!!

తా. అన్యాయంగా తన తండ్రిని చంపిన కార్తవీర్యార్జునిని వేయి చేతులను సమరాంగణంలో నరికివైచిన జమదగ్ని కుమారుడు పరశురామునికి నేను దాసుడను.

14. దాసో౽హం క్షితిజాజానేః కేవలం త్యాగశీలినః
ప్రజాశాసనబద్ధస్య త్యక్తదారస్య భూపతేః!!

తా. ప్రజాశాసనబద్ధుడై తన ప్రియభార్యనుకూడా విడిచిపెట్టిన భూపతి, భూజాత సీతాదేవిభర్త కేవలత్యాగశీలి అయిన శ్రీరామచంద్రునకు నేను దాసుడను.

15. దాసో౽హం రామచంద్రస్య యేన ధర్మః ప్రతిష్ఠితః
తద్ధర్మ రక్షణాయైవ ప్రస్థితః కాననం ప్రతి!!

తా. ఎవనిచే ధర్మము ప్రతిష్ఠింపబడినదో ఆ రామచంద్రునకు నేను దాసుడను. ఆ ధర్మరక్షణముకొఱకే ఆతడు కాననములకు ఏగెను.

16. దాసో౽ హం రామచంద్రస్య దివ్యయోః పదపద్మయోః
యయో రజఃకణేనైవ కాన్తాభూత్ కఠినా శిలా!!

తా. వేటి ధూళికణముచేతనే కఠినమైన శిల కాంతగా మారిపోయినదో, అటువంటి రామచంద్రుని పాదపద్మములకు నేను దాసుడను.

17. దాసో౽హం రామచన్ద్రస్య స్థిరకీర్తిప్రదాయినః
సేవయా యస్య దైవత్వం కపిరాజో౽పి లబ్ధవాన్!!

తా. ఎవని సేవవలన కపిరాజునకు కూడ దైవత్వము లభించినదో అటువంటి స్థిరకీర్తి ప్రదాత అయిన రామచంద్రునకు నేను దాసుడను.

18. దాసోఽహమేకవీరస్య శ్రీరామస్య నృణాం పతేః
యేనైవ దైత్యరాజేన్ద్రో దశకంఠోఽపి నిర్జితః!!

తా. ఎవనిచే పదికంఠములు కలిగిన రాక్షసేంద్రుడు నిర్జింపబడెనో అట్టి మానవపతియు, ఏకవీరుడు అయిన రామచంద్రునకు నేను దాసుడను.

19. దాసోఽహం వాసుదేవస్య గోవిన్దస్య జగద్గురోః
వేదాన్తాబ్ధిభవా గీతా యన్ముఖామ్భోజనిస్సృతా!!

తా. వేదాంతసముద్రమునుండి ఉద్భవించిన భగవద్గీత ఎవని ముఖపద్మమునుండి జాలువారినదో అట్టి జగద్గురువు, గోవిందుడు అయిన వాసుదేవునకు నేను దాసుడను.

20. దాసోఽహం వాసుదేవస్య మిత్రధర్మస్వరూపిణః
సమర్చితకుచేలస్య ప్రేమపీయూషదాయినః!!

తా. కుచేలుని సమర్చించినవాడు, ప్రేమామృతమును పంచినవాడు, మిత్రధర్మస్వరూపి అయిన వాసుదేవునకు నేను దాసుడను.

21. దాసోఽహం వాసుదేవస్య యోషిల్లోకహితైషిణః
యేన దత్తాని వాసాంసి పాఞ్చాలీమానరక్షణే!!

తా. పాంచాలీ మానరక్షణ సందర్భంలో ఎవనిచే వస్త్రములు ఇవ్వబడ్డాయో, స్త్రీల హితమును కోరుకొనే అట్టి వాసుదేవునకు నేను దాసుడను.

22. దాసోఽహం గోపబాలస్య యస్యాఙ్గుల్యా గిరిర్ధృతః
రక్షితా యేన గోపాలాః గావశ్చ పరిరక్షితాః!!

తా. ఎవని చేతివ్రేలితో గోవర్ధన పర్వతము ధరింపబడి గోపాలురు రక్షింపబడిరో, గోవులుకూడ రక్షింపబడినవో అట్టి గోపబాలునికి నేను దాసుడను.

23. దాసోఽహం బుద్ధదేవస్య యేన హింసా తిరస్కృతా
శాన్తిదీపేన లోకేఽస్మిన్ మోక్షమార్గః ప్రదర్శితః!!

తా. ఎవనిచే హింస తిరస్కరింపబడినదో, ఎవనిచే ఈలోకములో శాంతిదీపముద్వారా మోక్షమార్గము ప్రదర్శింపబడినదో అట్టి బుద్ధదేవునికి నేను దాసుడను.

24. దాసోఽహం కల్కిదేవస్య భావిని ప్రభవిష్యతః
యశ్శ్వేతహయమారుహ్య కరిష్యతి భువం శివామ్!!

తా. రానున్న కాలములో తెల్లని గుఱ్ఱమును అధిరోహించి, ఎవరు భూమిని మంగళాత్మకము కావించునో అట్టి కల్కిదేవునకు నేను దాసుడను.

25. దాసోఽహం వేదవిద్యాయా లోకే వర్ధితసంస్కృతేః
ధర్మార్థ కామ మోక్షాణాం సిద్ధిదాయా నిరంతరమ్!!

తా. ధర్మార్థకామమోక్షములను ఏది సిద్ధింపజేయుచున్నదో, దేనివలన లోకమునందు సంస్కృతి వృద్ధి పొందింపబడినదో అటువంటి వేదవిద్యకు నేను దాసుడను.

26. దాసోఽహం సతతం భూమేః సర్వేషామపి జీవినామ్
పౌష్టికాహార దాయిన్యాః ప్రాణదాయా నిరంతరమ్!!

తా. అన్నిజీవులకు పౌష్టికమైన ఆహారమును ప్రసాదించి, నిరంతరముగా ప్రాణములను నిలబెట్టుచున్న భూమికి ఎల్లపుడు నేను దాసుడను.

27. దాసోఽహం జలరూపస్య దైవతస్య నిరంతరమ్
యం వినా ప్రాణిలోకస్య జీవికా నహి దృశ్యతే!!

తా. ఏది లేకుంటే ప్రాణిలోకమునకు బ్రతుకు కనిపించదో అట్టి జలరూపదైవమునకు నింతరము నేను దాసుడను.

28. దాసో ఽహమగ్నిదేవస్య జీవచైతన్య దాయినః
యేనైవ భుక్త ఆహారో జీర్ణో భవతి కుక్షిషు!!

తా. ఎవనిచే భుజించిన ఆహారము కడుపులో జీర్ణమగుచున్నదో అటువంటి, జీవులకు చైతన్యమును ప్రసాదించునట్టి అగ్నిదేవునకు నేను దాసుడను.

29. దాసోఽహం వాయుదేవస్య సర్వేషాం తనుచారిణః
యం వినా నహి లోకోఽయం ముహూర్తమపి జీవతి!!

తా. ఎవరు లేకున్నచో ఈ లోకం ముహూర్తకాలం కూడా జీవించలేదో, అందరి శరీరములయందు సంచరించునదెవరో అట్టి వాయుదేవునకు నేను దాసుడను.

30. దాసోఽహం గగనస్యాపి సూర్యచంద్రౌచ తారకాః
విహరంతి సదా యత్ర సంహరంతి తమాంసిచ!!

తా. సూర్యచంద్రులు. తారకలు ఎల్లపుడు ఎక్కడ విహరించి చీకట్లను సంహరించుట జరుగుచున్నదో అటువంటి ఆకాశమునకు నేను దాసుడను.

31. దాసోఽహం మునిముఖ్యానామ్ శాస్త్రవాఙ్మయదాయినామ్
యైరేవ భారతీ భూమిః జ్ఞానభూమిరితి స్మృతా!!

తా. ఎవరిచేత ఈ భారతభూమి జ్ఞానభూమిగా పేరుగాంచినదో, శాస్త్రవాఙ్మయాన్ని లోకానికి అందించిన ఆ మునిశ్రేష్ఠులకు నేను దాసుడను.

32. దాసోఽహం కృషికర్తౄణామ్ లోకానామన్నదాయినామ్
స్వేదాభిషిక్త భూమీనామ్ క్షుదగ్నే రసవర్షిణామ్!!

తా. చెమటతో భూమిని అభిషేకించి, లోకానికి అన్నమును ప్రసాదించి, ఆకలి అనే అగ్నిని శాంతింపజేసే రసవర్షమువంటివారైన కర్షకులకు నేను దాసుడను.

33. దాసోऽహం సైనికాగ్రాణామ్ దేశాంచల నివాసినామ్

యేషాం త్యాగవ్రతేనైవ మాతృభూమి స్సురక్షితా!!

తా. దేశపు సరిహద్దులలో నివసించే ఎవరి త్యాగవ్రతముతో మాతృభూమి రక్షింపబడుచున్నదో ఆ సైనిక శ్రేష్ఠులకు నేను దాసుడను.

34. దాసో ऽహం వైద్యరాజానామ్ ప్రాణరక్షణశీలినామ్

యేషాంహి సేవయా లోకే రుగ్మతా పరిధావతి!!

తా. ఎవరి సేవవలన లోకములో వ్యాధి పరుగెత్తి పారిపోవుచున్నదో, ప్రాణరక్షణమే శీలముగా కలిగిన అట్టి వైద్యరాజులకు నేను దాసుడను.

35. దాసో ऽహం మాతృదేవీనామ్ సర్వేషామపి జీవినామ్

యాసాం గర్భాలయ స్థాన మాద్యం భవతి భూషితమ్!!

తా. జీవులందరికి ఎవరి గర్భాలయము మునుముందుగా అలంకరించిన స్థానము అగుచున్నదో అట్టి మాతృదేవులకు నేను దాసుడను.

36. దాసోऽ హం మాతృమూర్తీనామ్ సర్వేషాంచ కళావిదామ్

యాసాముత్సంగ ఏవాద్యా వేదీ భవతి భూషితా!!

తా. ఎవరి ఒడి కళాకారులందరికి మొదటి అలంకృత వేదిక అగుచున్నదో అట్టి మాతృమూర్తులకు నేను దాసుడను.

37. దాసోऽహం త్యాగశీలానామ్ మాతృదేశాభిమానినామ్

యేషాం త్యాగఫలేనైవ స్వాతంత్ర్యం సముపార్జితమ్!!

తా. ఎవరి త్యాగఫలముచేత స్వాతంత్ర్యము సంపాదింపబడినదో అట్టి మాతృదేశాభిమానులైన త్యాగశీలురకు నేను దాసుడను.

38. దాసోఽహం మాతృదేశస్య భారతాఖ్యస్య సంతతమ్
పుణ్యభూమిరితి ఖ్యాతి ర్యస్యైవ వర్తతే భువి!!

తా. ఈ భూమండలములో దేనికి పుణ్యభూమి అనే ఖ్యాతి ఏర్పడినదో
అట్టి నా మాతృభూమియైన భారతదేశమునకు ఎల్లపుడు నేను దాసుడను.

39. దాసోఽహం భారతీయానాం సర్వేషాం పితురన్వహమ్
యస్య నాయకతా శక్త్యా స్వాతంత్ర్యం సముపార్జితమ్!!

తా. ఎవరి నాయకత్వశక్తిచేత స్వాతంత్ర్యం సముపార్జింపబడినదో,
భారతీయులందరికి తండ్రియైన ఆ జాతిపితకు ఎల్లపుడు నేను దాసుడను.

40. దాసోఽ హం యోగినాం నిత్యం కాషాయాంబరధారిణామ్
సత్యేన తపసా యేషాం లోకో భవతి రక్షితః!!

తా. ఏ సన్యాసాశ్రమవాసుల సత్యమైన తపస్సుచేత ఈ లోకము
రక్షింపబడుచున్నదో ఆట్టి యోగులకు నిత్యము నేను దాసుడను.

41. దాసో ఽహం వ్యాసదేవస్య వేదవిద్యా విభాగినః
యేనైవ పంచమో వేదః సృష్టస్సర్వరసాత్మకః!!

తా. ఎవనిచే సర్వరసాత్మకముగా పంచమవేదము(మహాభారతము)
సృష్టింపబడినదో, వేదవిద్యను విభాగముచేసిన ఆ వ్యాసదేవునకు నేను
దాసుడను.

42. దాసోఽ హం కాళిదాసస్య కవితా విశ్వరూపిణః
యేన సంస్కృత సాహిత్యం సర్వధా సమలంకృతమ్!!

తా. ఎవనిచే సంస్కృత సాహిత్యము అన్నివిధముల సమలంకరింపబడినదో
అటువంటి కవితా విశ్వరూపి కాళిదాసునకు నేను దాసుడను.

43. దాసోఽహం పంచకావ్యానామ్ యేషు భాతి సరస్వతీ
యేషాం పఠనమాత్రేణ నరో భవతి పండితః!!

తా. వేటిని చదివినంతమాత్రంచేతనే నరుడు పండితుడు కాగలడో, వేటియందు సరస్వతి ప్రకాశించుచున్నదో అటువంటి పంచకావ్యములకు ( రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము, శిశుపాలవధ) నేను దాసుడను.

44. దాసోఽహం తరురాజానామ్ లోకసేవైక శీలినామ్
యైర్వినా నాస్తి లోకేఽస్మిన్ క్షణకోలోఽపి జీవికా!!

తా. ఏవి లేకుంటే ఈ లోకంలో క్షణకాలముకూడ బ్రతుకు లేదో అటువంటి లోకసేవయే శీలముగా కలిగిన వృక్షరాజములకు నేను దాసుడను.

45. దాసోఽహం తరురాజానామ్ ప్రాణవాయు ప్రదాయినామ్
పత్రం పుష్పం ఫలం కాయః యేషాం లోకాయ కేవలమ్!!

తా. వేటి ఆకు, పుష్పము, ఫలము, చివరకు శరీరముకూడ లోకమునకే ఉపయోగపడుచున్నవో, ప్రాణవాయువును లోకులకు అందించుచున్న అట్టి గొప్ప వృక్షములకు నేను దాసుడను.

46. దాసోఽ హం గిరిరాజానామ్ సర్వేషాంచ మహీభృతామ్
యేషాం శరీరమాశ్రిత్య జాయతే బహుకాననమ్!!

తా. వేటి శరీరమును ఆశ్రయించుకొని ఎన్నో అడవులు పుట్టుచున్నవో, ఈ భూమిని మోయుచున్న గొప్ప పర్వతములకు అన్నింటికి నేను దాసుడను.

47. దాసో ఽహం కాలమేఘానామ్ ధరణ్యై రసవర్షిణామ్
యైరంభో లవణం పీత్వా దీయతే మధురం జలమ్!!

తా. సముద్రములోని ఉప్పునీటిని త్రాగి, తిరిగి భూమిపై వర్షించి, లోకమునకు తీయటి నీటిని అందించుచున్న కాలమేఘములకు నేను దాసుడను.

48. దాసోఽ హం పికరాజానామ్ కర్ణపీయూష దాయినామ్
యేషాం కుహూరుతం శ్రుత్వా కవీనాం జాయతే రసః!!

తా. వేటి కుహూరుతము వినుటచేత కవులయందు రసము పుట్టుచున్నదో, చెవులకు అమృతమునిచ్చే అట్టి గొప్ప కోయిలలకు నేను దాసుడను.

49. దాసోఽహం ఖలు ధేనూనామ్ యాసు తిష్ఠంతి దేవతాః
తృణం భుక్త్వా పయో దత్వా పూజ్యంతే సకలైర్జనైః!!

తా. ఏవి గడ్డి తిని, పాలను ఇచ్చి, జనులందరిచే పూజింపబడుచున్నవో, వేటియందు దేవతలు నివసించుచున్నారో అట్టి గోవులకు నేను దాసుడను.

50. దాసోఽహం సూర్యదేవస్య జగతః కర్మసాక్షిణః
యస్యైవ తేజసా లోకః చైతన్యమధిగచ్ఛతి!!

తా. ఎవని తేజస్సువల్ల లోకము చైతన్యమును పొందుచున్నదో, ప్రపంచమునకు కర్మసాక్షి అయిన ఆ సూర్యదేవునకు నేను దాసుడను.

51. దాసోఽహం ఖలు శీతాంశో స్సర్వారాధ్య సుధాతనోః
తీక్ష్ణం తేజస్సమాస్వాద్య శీతం తేజో దదాతి యః!!

తా. సూర్యునినుండి తీవ్రమైన తేజస్సును స్వీకరించి, చల్లని వెలుగులను అందించువాడు, అందరిచేత ఆరాధింపబడే అమృతమయమైన శరీరము కలవాడు అయిన శీతకిరణుడగు చంద్రునకు నేను దాసుడను.

52. దాసోఽహం భూమిపాలానామ్ నీతిమార్గాభిగామినామ్
యేషాంతు పాలనే లోకే వ్యవస్థా పరిరక్షితా!!

తా. ఎవరి పాలనలో లోక వ్యవస్థ పరిరక్షింపబడుచున్నదో నీతిమార్గంలో నడచే అటువంటి భూపాలకులకు నేను దాసుడను.

53. దాసోఽహం తంతువాయానామ్ చిత్రవస్త్ర ప్రదాయినామ్
యే కుర్వన్తి కళాశక్త్యా లోకమానాభిరక్షణమ్!!

తా. వారికి గల కళాశక్తితో లోకుల మానమును రక్షించుటకు చిత్రచిత్ర వస్త్రములను తయారుచేసి అందించుచున్న నేతపనివారికి నేను దాసుడను.

54. దాసోఽహం సామజాతస్య సంగీతస్య నిరంతరమ్
యస్య శ్రవణమాత్రేణ శిశుశ్చ పరిమోదతే!!

తా. ఏది విన్నంతమాత్రమున శిశువుకూడ ఆనందించుచున్నదో, సామవేదమునుండి పుట్టిన అట్టి సంగీతమునకు నేను నిరంతరము దాసుడను.

55. దాసోఽహం శిల్పిముఖ్యానా మపర బ్రహ్మణాం సదా
యేషామేవ కళాశక్త్యా దేవతా నేత్రగోచరాః!!

తా. ఎవరి కళాశక్తితో దేవతలరూపాలను కంటితో చూడగలుగుతున్నామో, అటువంటి అపరబ్రహ్మలైన శిల్పిశ్రేష్ఠులకు నేను దాసుడను.

56. దాసోఽహమేవ బాల్యస్య యస్మిన్ చింతా న వర్తతే
యత్ర స్వార్థపిశాచానామ్ నర్తనం నాభిదృశ్యతే!!

తా. ఎచ్చట స్వార్థపిశాచముల నాట్యం కనిపించదో, ఎక్కడ దుఃఖమనేదే ఉండదో అటువంటి బాల్యమునకు నేను దాసుడను.

57. దాసోஉహమేవ బాల్యస్య కేవలానంద దాయినః
యస్మిన్ న జాయతే శాఠ్యమ్ యత్ర సత్యం న వంచ్యతే!!

తా. ఎక్కడ సత్యము వంచింపబడదో, ఎక్కడ మోసము పుట్టదో, ఏది కేవలము ఆనందమును మాత్రమే ఇచ్చునో అటువంటి బాల్యమునకు నేను దాసుడను.

58. దాసోஉహమరవిందానామ్ భృంగానామాతిథేయినామ్
యాని పంకే జనిం ప్రాప్య దాతుం శక్తాని వై మధు!!

తా. ఏవి బురదలో పుట్టికూడ తేనెను ఇవ్వగలుగుచున్నవో, తుమ్మెదలకు ఆతిథ్యమునిచ్చు అటువంటి పద్మములకు నేను దాసుడను.

59. దాసోஉహమరవిందస్య యస్మిన్ జాతశ్చతుర్ముఖః
యదేవ పీఠం భారత్యాః స్థితా యత్రచ మాధవీ!!

తా. దేనియందు చతుర్ముఖుడైన బ్రహ్మ ఉదయించెనో, ఏది సరస్వతికి పీఠమో, లక్ష్మీదేవికూడ ఎందు ఉండునో అటువంటి పద్మమునకు నేను దాసుడను.

60. దాసోஉహం రామదూతస్య వాయుపుత్రస్య ధీమతః
యేనైవ ప్రకటితా నూనమ్ స్వామిభక్తి స్సమంచితా!!

తా. గొప్పదైన స్వామిభక్తి ఎవరిచే నిశ్చయముగా ప్రకటింపబడినదో, అటువంటి వాయుపుత్రుడైన రామదూత హనుమంతునకు నేను దాసుడను.

61. దాసోஉహం సత్యసంధస్య హరిశ్చంద్రస్య భూపతేః
త్యక్తం యేనచ సర్వస్వం సత్యాయైవతు కేవలమ్!!

తా. కేవలము సత్యముకొఱకే సర్వస్వము ఎవరిచే త్యాగము చేయబడినదో అటువంటి సత్యసంధుడైన హరిశ్చంద్రమహారాజునకు నేను దాసుడను.

62. దాసోఽహం సహచారిణ్యాః హరిశ్చంద్రమహీపతేః
తస్య సత్యగుణౌన్నత్యం లోకేఽస్మిన్ విశ్రుతం యయా!!

తా. ఎవరి సహకారముచేత హరిశ్చంద్రమహీపతియొక్క సత్యగుణ ఔన్నత్యం లోకంలో విస్తరింపబడిందో అటువంటి ఆయన ధర్మపత్ని చంద్రమతికి నేను దాసుడను.

63. దాసోఽహం శాస్త్రవేత్తౄణామ్ నిత్యశోధనశీలినామ్
యేషాం మేథాబలైర్నైవ లోకోఽయమభివర్ధతే!!

తా. ఎవరిమేధాబలమువలన ఈ లోకము అభివృద్ధి పొందుచున్నదో, అటువంటి నిత్యపరిశోధనాశీలురైన శాస్త్రవేత్తలకు నేను దాసుడను.

64. దాసోఽహం వృద్ధమూర్తీనామ్ చిరానుభవధారిణామ్
యేషామనుభవ జ్ఞానమ్ జగతీమభిరక్షతి!!

తా. ఎవరి అనుభవజ్ఞానం జగత్తును రక్షించుచున్నదో, అటువంటి చిరకాలానుభవధారులైన వృద్ధమూర్తులకు నేను దాసుడను.

65. దాసోఽహం పక్షిరాజస్య జటాయోస్త్యాగశీలినః
రక్షణే రామదారాణామ్ యేన త్యక్తంహి జీవితమ్!!

తా. రాముని భార్యను రక్షించే ప్రయత్నంలో తన జీవితాన్నే త్యాగం చేసిన త్యాగశీలియైన పక్షిరాజు జటాయువునకు నేను దాసుడను.

66. దాసోఽహం ప్రవరాఖ్యస్య నిష్ఠాప్రవరశీలినః
యేనాప్సరా మనోజ్ఞాంగీ తిరస్కృతా వరూధినీ!!

తా. మనోహరమైన అందం కలిగికూడా అప్సరస అయిన వరూధిని ఎవనిచే తిరస్కరింపబడినదో అటువంటి నిష్ఠాప్రవరశీలుడైన ప్రవరునకు నేను దాసుడను.

67. దాసోఽహమనసూయాయాః జితం మూర్తిత్రయం యయా
పాతివ్రత్యస్య మాహాత్మ్యమ్ ప్రపంచేఽస్మిన్ నిరూపితమ్!!

తా. ఎవరు త్రిమూర్తులను జయించి, పాతివ్రత్యమహిమను ప్రపంచములో నిరూపించెనో అటువంటి అనసూయాదేవికి నేను దాసుడను.

68. దాసోఽహం యువశక్తేశ్చ దేశసౌభాగ్యదాయకమ్
కర్మ నిర్వహణే యస్యాః వర్తతే హి సమర్థతా!!

తా. ఏ పనినైనా చేయగల సమర్థత దేనికి గలదో అటువంటి, దేశమునకు సౌభాగ్యమును అందింపగల యువశక్తికి నేను దాసుడను.

69. దాసోఽహం పితృపాదానామ్ సంతతేర్మార్గదర్శినామ్
యేషాం సూచనయా జాతిః పురోగమనశాలినీ!!

తా. ఎవరి సూచనతో జాతి ఎల్లపుడూ పురోగమించుచుండునో అట్టి నిత్యమార్గదర్శకులైన పితృపాదులకు (తండ్రిస్థానంలో ఉన్నవారికి) నేను దాసుడను.

70. దాసోఽహమాపగానాంచ యాభిస్తృష్ణా నివార్యతే
క్ష్మాతలే వర్ధతే సస్యమ్ దీయతేచ పవిత్రతా!!

తా. వేటిచేత దప్పిక నివారింపబడుచున్నదో, భూతలమున వేటిచే పంటలు పండుచున్నవో, పవిత్రత వేటిచే కల్పించబడుచున్నదో అటువంటి నదులకు నేను దాసుడను.

71. దాసోఽహం ప్రకృతేర్మానమ్ యస్యాస్తు సేవయా సదా
జీవంతి ప్రాణినస్సర్వే సర్వదేశేషు సర్వధా!!

తా. దేనిని సేవించుటచే సర్వదేశములందలి ప్రాణులన్నియు అన్నివిధములుగా జీవించుచున్నవో, అటువంటి ప్రకృతికి నేను నిశ్చయముగా దాసుడను.

72. దాసోఽహం గజరాజస్య యస్య ప్రార్థనఘోషయా
రభసాద్విష్ణురానీతో భూలోకం శ్రితరక్షకః!!

తా. ఆశ్రితులను రక్షించు శ్రీహరి ఎవరి ప్రార్థనఘోషతో భూలోకమునకు వేగాతివేగముగా తీసికొని రాబడెనో అటువంటి గజరాజునకు నేను దాసుడను.

73. దాసోఽహం కరపద్మానామ్ నరాణాం దానశీలినామ్
దీనానాం జీవనక్షేత్రే యాని వర్షన్తి వై సుధామ్!!

తా. దీనుల బ్రతుకు పొలములో ఏవి అమృతమును వర్షించుచున్నవో, దానశీలురైన మానవుల పద్మములవంటి ఆ చేతులకు నేను దాసుడను.

74. దాసోఽహం ధృఢదీక్షస్య భగీరథతపస్వినః
యేనావతారితా గంగా సర్వకల్మషహారిణీ!!

తా. సమస్త కల్మషములను హరించు గంగ ఎవరిచేత ఈలోకమునకు తీసికొనిరాబడినదో, ఆ గొప్ప దీక్షాపరుడైన తపస్వి భగీరథునకు నేను దాసుడను.

75. దాసోఽహం శిశుహాసస్య సర్వానంద ప్రదాయినః
యం దృష్ట్వా చిత్తవైకల్యం సమూలమపగచ్ఛతి!!

తా. ఏది చూచినచో మానసిక వైకల్యం సమూలముగా పోవుచున్నదో, అందరికీ ఆనందాన్ని ప్రసాదించగలిగినది ఏదో అటువంటి చంటిపిల్లల నవ్వునకు నేను దాసుడను.

76. దాసోఽహం దేవదేవస్య నిస్సీమ కరుణాత్మనః
యేన దీక్షా ధృతా నూనమ్ గర్భస్థశిశుపోషణే!!

తా. గర్భములోనున్న శిశువును పోషించుటకు నిశ్చయముగా ఎవనిచే దీక్ష ధరింపబడినదో, అటువంటి అపారమైన దయామూర్తి దేవదేవునకు నేను దాసుడను.

77. దాసోఽహం దేవదేవస్య నిరాలంబే వియత్పథి
యస్య సంకల్పమాత్రేణ యథాకక్ష్యం స్థితా గ్రహాః!!

తా. ఎవని సంకల్పమాత్రముచేత గ్రహములన్నియు ఏ ఆధారమూ లేని అంతరిక్షములో వాటి వాటి కక్ష్యలను అతిక్రమించకుండగా నిలుచుచున్నవో అట్టి దేవదేవునకు నేను దాసుడను.

78. దాసోఽహం భోజరాజస్య యన్ముఖాంభోజ దర్శనే
సర్వోఽపి కవితాం వక్తుం సమర్థోఽభూత్ రసాత్మికామ్!!

తా. ఎవరి ముఖపద్మమును చూచినంతనే ఎవరైనా రసాత్మికమైన కవిత్వమును చెప్పగలిగేవారో అటువంటి భోజరాజునకు నేను దాసుడను.

79. దాసోఽహం భోజరాజస్య యేన సంస్కృతభారతీ
భూషితా, నవరత్నాని పోషితాని సగౌరవమ్!!

తా. ఎవనిచే సంస్కృతభాషా సరస్వతి అలంకరింపబడినదో, ఎవనిచే నవరత్నములు అను పేరుగల తొమ్మిదిమంది సంస్కృతభాషా మహాకవులు సగౌరవముగా పోషింపబడ్డారో అటువంటి భోజరాజునకు నేను దాసుడను.

80. దాసోఽహం వ్యాసదేవస్య యన్ముఖాంభోజనిర్గతా
హ్యష్టాదశపురాణాఖ్యా సుధా సంస్కృతిభూషితా!!

తా. సంస్కృతితో అలంకరింపబడిన అష్టాదశ పురాణములనే అమృతము ఎవరి ముఖపద్మమునుండి జాలువారినదో అట్టి వ్యాసదేవునకు నేను దాసుడను.

81. దాసోఽహం వ్యాసదేవస్య కవితావిశ్వరూపిణః
దత్తం భాగవతం యేన యస్మింస్తత్త్వమ్ ప్రతిష్ఠితిమ్!!

తా. దేనియందు తత్త్వము ప్రతిష్ఠింపబడినదో, అట్టి భాగవతము ఎవనిచే అనుగ్రహింపబడినదో అటువంటి కవితా విశ్వరూపియైన వ్యాసదేవునకు నేను దాసుడను.

82. దాసోఽహం హంసరాజస్య యమారుహ్య సరస్వతీ
సంచారం సర్వలోకేషు కరోతి కవితాత్మికా!!

తా. దేనిని అధిరోహించి కవితాస్వరూపిణియైన సరస్వతి సర్వలోకములయందు సంచరించునో అటువంటి హంసరాజమునకు నేను దాసుడను.

83. దాసోఽహం ఖగరాజస్య వైనతేయస్య సంతతమ్
జగద్భారవహం దేవమ్ శ్రీహరిం వహతే హి యః!!

తా. మొత్తము ప్రపంచభారమును వహించుచున్న శ్రీహరినే మోయునది ఎవరో అట్టి వినతాపుత్రుడు, పక్షిరాజు అయిన గరుత్మంతునకు నేను దాసుడను.

84. దాసోఽహం ఋతురాజస్య వసంతస్య నిరంతరమ్
యస్య దర్శనమాత్రేణ కవితా జాయతే కవేః!!

తా. దేనిని దర్శించినంతమాత్రమున కవికి కవిత్వము పుట్టుచున్నదో, అటువంటి ఋతురాజము వసంతమునకు నిరంతరము నేను దాసుడను.

85. దాసోఽహం గురుదేవస్య శంకరస్య తపస్వినః
పారమార్థికతా యేన సుస్పష్టం ప్రతిపాదితా!!

తా. ఎవరిచే పారమార్థిక తత్త్వము సుస్పష్టముగా ప్రతిపాదింపబడినదో, అట్టి తపస్వియైన గురుదేవుడు శంకరాచార్యునకు నేను దాసుడను.

86. దాసోఽహం బాలభక్తస్య ప్రహ్లాదస్య పునఃపునః
సర్వాంతర్యామితా విష్ణోః లోకే యేన నిరూపితా!!

తా. విష్ణుమూర్తియొక్క సర్వాంతర్యామిత్వము ఎవరిచే లోకమునందు నిరూపింపబడినదో అట్టి బాలభక్తుడైన ప్రహ్లాదునకు మరల మరల నేను దాసుడను.

87. దాసోఽహం మృగరాజస్య క్షుద్బాధాపీడితేనచ
ఖాద్యతే నహి యేనాన్నమ్ కేవలం స్వార్జితం వినా!!

తా. ఆకలిబాధతో పీడింపబడుచున్నను స్వయముగా సంపాదించుకొన్నదే తప్ప పరాన్నమును తినని మృగరాజు సింహమునకు నేను దాసుడను.

88. దాసోఽహం ఖలు కాకానామైకమత్యస్య నిత్యశః
తథా పిపీలికానాంచ శ్రమశక్తేర్నిరంతరమ్!!

తా. కాకులలోని ఐకమత్యమునకు నేను నిత్యము దాసుడను.
అటులే చీమలలోని శ్రమశక్తికి కూడ నిరంతరము నేను దాసుడను.

89. దాసోఽహం మాధ్యమస్యాపి యస్య విప్లవహేతునా
కుగ్రామమివ పశ్యామి ప్రపంచమధునాతనమ్!!

తా. దేనియందు ఏర్పడిన విప్లవకారణముగా అధునాతన ప్రపంచము మొత్తమును ఒక కుగ్రామముగా చూడగలుగుచున్నానో అటువంటి మాధ్యమమునకు (సమాచార ప్రసార వ్యవస్థ) నేను దాసుడను.

90. దాసోఽహం ధీమతాం నిత్యం యేషాం బుద్ధిర్మహోన్నతా
క్షణం క్షణమిమం లోకం కరోతి నవనూతనమ్!!

తా. ఎవరి మహోన్నతమైన బుద్ధి ఈ లోకమును క్షణక్షణము నవ నూతనముగా చేయుచున్నదో అటువంటి మేధావులకు నేను ఎల్లప్పుడూ దాసుడను.

91. దాసోఽహం హిమశైలస్య యస్మాత్ గంగా వినిస్సృతా
యా భూమి స్సిద్ధసంఘానాం మహర్షీణాం తపస్వినామ్!!

తా. మహర్షులకు, తపస్వులకు, సిద్ధసంఘములకు ఏది స్థానమో, ఎచటినుండి గంగానది క్రిందికి జాలువారినదో అట్టి హిమవత్పర్వతమునకు నేను దాసుడను.

92. దాసోఽహం నగరాజస్య యస్యాతిశీతలా తనుః
దదాతి రక్షణం నిత్యం శత్రుభ్యో భరతావనేః!!

తా. చల్లని శరీరము కలిగి, శత్రువులనుండి నిత్యము భరతావనికి రక్షణ కల్పించుచున్న నగరాజమైన హిమాచలమునకు నేను దాసుడను.

93. దాసోఽహం త్యాగశీలస్య ఫణిరాజస్య వాసుకేః
దేవతా లబ్ధపీయూషాః యస్య కాయాతిపీడనాత్!!

తా. ఎవని శరీరము అతిమాత్రముగా పీడింపబడుటవలన దేవతలకు అమృతము లభించినదో, ఆ త్యాగశీలుడైన నాగరాజు వాసుకికి నేను దాసుడను.

94. దాసోఽహం కైకయీదేవ్యాః యా ప్రాసూత సుధార్మికమ్
శిరసా యస్య ధృతే భ్రాతుః పాదుకే ధర్మభూషితే!!

తా. ధర్మాలంకృతములైన అన్నగారి పాదుకలు ఎవరి శిరస్సుచేత ధరింపబడ్డాయో అటువంటి సుధార్మికుడైన భరతునివంటి కుమారుని గన్న కైకకు నేను దాసుడను.

95. దాసోఽహమర్జునస్యాపి గీతాయా జన్మకారకః
నాస్తి వేదాంత విజ్ఞానే యాం వినా పరిపూర్ణతా!!

తా. ఏది లేనిదే వేదాంతవిజ్ఞానమునందు పరిపూర్ణత లేదో అటువంటి భగవద్గీత పుట్టుటకు కారకుడైన అర్జునునకుకూడ నేను దాసుడను.

96. దాసోఽహం వల్లకీపాణేః భారత్యాః కరపద్మయోః
యయోర్నిపుణతా ధాతుః కర్ణాష్టకరసాయనమ్!!

తా. వేటి నైపుణ్యము బ్రహ్మదేవుని ఎనిమిది చెవులకు రసాయనమువంటిదగుచున్నదో వీణాపాణియైన భారతీదేవియొక్క పద్మములవంటి ఆ చేతులకు నేను దాసుడను.

97. దాసోఽహం వణిజాంచాపి వ్యాపారేఽభినివేశినామ్
యైరేవసర్వ వస్తూని లభ్యన్తే సర్వతో భువి!!

తా. ఎవరిద్వారా అన్నిరకములైన వస్తువులు భూమండలమంతట లభించుచున్నవో వ్యాపారమునందు దక్షులైన ఆ వర్తకులకుకూడ నేను దాసుడను.

98. దాసోఽహమేవ సర్వేషామ్ ధర్మమార్గానుగామినామ్
యేషామాత్మబలేనైవ ధరిత్రీ ధార్యతే సదా!!

తా. ఎవరి ఆత్మబలముచేత ఎల్లకాలము భూమి భరింపబడుచున్నదో అటువంటి ధర్మమార్గ సంచారులందరికీ నేను దాసుడనే.

99. దాసోఽహం శాంతచిత్తస్య శాంతిరేవ విభూషణమ్
యాం వినా ధనవాన్ విద్వాన్ న కోఽపి సుఖమేధతే!!

తా. ఏది లేకుంటే ధనవంతుడైనా, విద్యావంతుడైనా సుఖమును పొందడో అటువంటి శాంతమే నిజమైన అలంకారము. ఎవడు శాంతచిత్తుడో అతనికి నేను దాసుడను.

100. దాసోఽహం నిర్వివాదస్య వివాదరహితో జనః
సఖ్యం కుటుంబసౌఖ్యంచ కీర్తిం ప్రాప్నోత్యనుత్తమామ్!!

తా. నిర్వివాదుడైన వ్యక్తికి నేను దాసుడను. వివాదరహితుడైనవాడు అందరితో స్నేహాన్ని, కుటుంబసౌఖ్యమును, గొప్పదైన కీర్తినికూడ పొందగలుగును.

101. దాసోஉహం రామమాతుశ్చ కౌసల్యాయాః పునఃపునః
యాహ్యేవ మానినీ లోకే కేవలా హరిమధ్యమా!!

తా. మానినులలో నిజమైన హరిమధ్య ఎవరో అటువంటి రాముని తల్లియైన కౌసల్యకు నేను మరల మరల దాసుడను.( హరి అనగా సింహము అని, విష్ణువు అనికూడ అర్థములు. ఆడువారి నడుము సింహం నడుమువలె సన్నగా ఉంటుందిగనుక హరిమధ్య అంటారు. కాని కౌసల్య నిజంగా హరిమధ్య. ఎందుకంటే సాక్షాత్తు శ్రీహరియే ఆమె గర్భవాసమునందు ఉన్నాడు గనుక.)

102. దాసోஉహం భాగ్యవత్యాశ్చ యశోదాయా నిరంతరమ్
శిశువక్త్ర సరోజాతే యాపశ్యదఖిలం జగత్!!

తా. ఎవరు పసిబిడ్డయైన శ్రీకృష్ణుని పద్మమువంటి ముఖములో అఖిలజగత్తును దర్శింపగలిగెనో, ఆ భాగ్యవంతురాలైన యశోదకు నేను దాసుడను.

103. దాసోஉహం వసుదేవస్య జగద్భారవహం హరిమ్
శిశురూపం మహాత్మా యో బభార శిరసా పురా!!

తా. ప్రపంచభారమంతటినీ భరించే హరి పూర్వం శిశురూపములో (శ్రీకృష్ణుని రూపములో) ఉన్నపుడు ఏమహాత్ముడో ఆహరిని తలపై పెట్టుకొని మోసెనో ఆ వసుదేవునకు నేను దాసుడను.

104. దాసోஉహమన్వహం తేషాం యేషాం చేతస్సరోవరే
కృతజ్ఞతా సరోజాని వికసంతి పునఃపునః!!

తా. ఎవరి మానససరోవరములో మరల మరల కృతజ్ఞతా పద్మములు వికసించుచుండునో అటువంటివారికి నేను ఎల్లపుడు దాసుడను.

105. దాసోఽహం సత్యశీలానామ్ ధర్మమార్గానుగామినామ్
దైవతార్పిత చిత్తానామ్ సారాసార వివేకినామ్!!

తా. సత్యమే శీలముగా కలవారికి, ధర్మమార్గమునందే సంచరించువారికి, దైవమునకు మనసును అర్పించినవారికి, ఏది సారమో ఏది నిస్సారమో గ్రహించగల వివేకవంతులకు నేను దాసుడను.

106. దాసోఽహం తత్త్వవేత్తౄణామ్ నిత్యానంద ప్రదాయినామ్
సర్వధా శాంతచిత్తానామ్ అన్వహం స్మితభాషిణామ్!!

తా. ఎల్లపుడు నవ్వుతూ మాట్లాడువారు, అన్నివిధముల శాంతముతో కూడిన మనస్సు కలవారు, నిత్యమైన ఆనందాన్ని అందివ్వగలవారు అయిన తత్త్వవేత్తలకు నేను దాసుడను.

107. దాసోఽహం భారతీదేవ్యాః వేంకటరామశాస్త్రిణః
యావుభౌ జన్మదాతారౌ పూజ్యపాదౌ మమాన్వహమ్!!

తా. నిరంతరము పూజ్యపాదులు, నాకు జన్మను ప్రసాదించినవారును అయిన భారతీ వేంకటరామయశాస్త్రి దంపతులకు నేను దాసుడను.

108. దాసోఽహం సర్వదేవానామ్ లోకకల్యాణదాయినామ్
యత్కృపా సర్వకాలేషు దదాతి జయమంగళమ్!!

తా. ఎవరి కృప ఎల్లకాలములయందు జయమంగళమును ప్రసాదించుచున్నదో, అటువంటి లోకకల్యాణదాయకులైన దేవతలందరికి నేను దాసుడను.

## గుండెలో కొలువైన...

| | |
|---|---|
| మహామహోపాధ్యాయ | శ్రీ విశ్వనాథ గోపాలకృష్ణ |
| సాలంకారసరస్వతి | డా. కొంపెల్ల రామసూర్యనారాయణ |
| వ్యాకరణవారాశి | శ్రీ కొంపెల్ల సత్యనారాయణ |
| గీర్భల సమ్రాట్ | శ్రీ దోర్బల ప్రభాకర శర్మ |
| సారస్వత బృహస్పతి | డా. శలాక రఘునాథ శర్మ |
| కృతిపతి | డా. చట్లపల్లి జగన్మోహన్ |
| హిందీ అనువాదిక | శ్రీమతి లంక దమయంతి |
| ఆంగ్ల అనువాదకులు | శ్రీ పొన్నపల్లి శ్రీరామారావు |
| | మఱియు |
| | శ్రీ యఱ్ఱమిల్లి నారాయణమూర్తి |
| క్రియేటివ్ ప్రెస్ అధినేత | శ్రీ పి. శ్రీనివాస్ |

ఇంకా ఎందరో, ఎందరెందరో ...

అభిమానులు, ఆప్తులు, బంధుమిత్రులు, శ్రేయోభిలాషులు

వీరందరికీ అన్నివేళల కృతజ్ఞుడను.

వీరందరి అభిమానమునకు పాత్రుడనైనందుకు ధన్యుడను.

కడిమిళ్ల వరప్రసాద్



కడిమిళ్ళను సత్కరిస్తున్న  నటసమ్రాట్ అక్కినేని



గానగంధర్వ బాలమురళీకృష్ణతో




కడిమిళ్ళను సత్కరిస్తున్న నాటి ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడు



కడిమిళ్ళను సత్కరిస్తున్న జ్ఞానపీఠి డా॥ సి. నారాయణరెడ్డి

తస్మై శ్రీ గురవే నమః



# పితరౌ వన్దే



శ్రీ కడిమిళ్ళ వేంకటరామయ్యశాస్త్రి - శ్రీమతి భారతి

[illegible] భారతీదేవ్యాః వేంకటరామశాస్త్రిణః

[illegible] జన్మదాతారౌ పూజ్యపాదౌ [illegible]



దాసోఽహం గురుదేవానాముత్తమ జ్ఞానదాయినామ్
వాత్సల్యపరిపూర్ణానామన్వహం హితభాషిణామ్

దాసోఽహమన్వహం తేషామ్ యేషాఞ్చేతస్సరోవరే
కృతజ్ఞతాసరోజాని వికసన్తి పునఃపునః



Creative. NSP 273113